# మధురపండితరాజము

2380

పింగళి లక్ష్మీకాంతం

1. Title of the book: మధురపంటిరంగాలు.
2. Price of the book: Rs 2/=

3. Number of copies on hand with the publishers: 1000.

4. Name of the publishers
5. Address from which the copies can be had:

M. S. R. MURTY & CO
PUBLISHERS & BOOK SELLERS
VISAKHAPATNAM 2

6. Examination for which intended: B. A. Modern Poetry.

Station: Visakhapatnam
dt/10.5.67

For M. S. R. Murty & Co.,

Proprietor.

# మధురపండితరాజము

★

శ్రీ పింగళి లక్ష్మీకాంతం

★

ప్రచురణ :
యం. యస్. ఆర్. మూర్తి అండ్ కో.,
విశాఖపట్టణము

సర్వస్వామ్య సంకలితము

1962

మూల్యము
రెండు రూపాయలు

## మ న వి

ఇందు 'తేజోలహరి' లోని నాలుగు పద్యములకు మయూరుని సూర్యశతకశ్లోకములు మూలము. తక్కిన గ్రంథ మంతయు జగన్నాథ పండితరాయల శ్లోకములకు స్వేచ్ఛానువాదము, మూలవిధేయము కాదు. ఇది పూర్వకవుల పద్ధతి.

—వింగళి లక్ష్మీకాంతం

★

# విషయ సూచిక


| | | పుట |
|---|---|---|
| తేజోలహరి | ... | 1 |
| గంగాలహరి | ... | 9 |
| అన్యాపదేశలహరి : | | |
| భ్రమరగీతి | ... | 32 |
| పద్మవనము | ... | 38 |
| జలధరార్భటి | ... | 41 |
| దుర్జనతాడనము | ... | 44 |
| గజబృంహితము | ... | 46 |
| సింహగర్జనము | ... | 48 |
| చందనచర్చ | ... | 49 |
| కోకిలాలాపము | ... | 52 |
| కురంగీవిలాపము | ... | 55 |
| చిలుకపలుకు | ... | 57 |


★

# తేజోలహరి

## 1

సీ. ఉదయాద్రిశిఖరసానూద్భూతధాతుధా
రామజ్జనక్రీడ రక్తి నొంది
జంభారిభద్రేభకుంభస్థలీసాంద్ర
సిందూరరజముతోఁ జెలిమి చేసి
త్రిదశకన్యాకరార్పితహేమజలజాత
బలిపుష్పపరిచితిన్ బ్రౌఢి మెఱసి
దరహసితాంభోజదళదళాంతరరాగ
సంగ్రహోత్కంఠచే జాజువాటి
గీ. యబ్జజాండఘటీబహిరంతరములఁ
దళుకుజలపోత గావించి వెలుఁగు నవిగొ
నవనవారుణభానుభానువులు ప్రార్థ
నాంజలి ఘటింపుఁ డభ్యుదయమ్ము లొసఁగు.

## 2

సీ. మందారకింజల్కమాత్రాకృతిఁ దొల్తఁ
బొడుపుగుబ్బలిమీఁదఁ బొటమరించి
యంతలోఁ బెనుతీఁగెలంత లై మాహేంద్ర
దిక్ప్రాంగణమ్ము నతిక్రమించి
యంతంత దుర్నిరీక్ష్యప్రోన్నతంబు లై
గగనాంతరాళలంఘన మొనర్చి
వాగతీతప్రభావమ్ము లై యాశావ
కాశమ్ము లన్నింటఁ గలయఁ బ్రాఁకి

గీ. త్రిభువనాక్రాంతి విక్రమరేఖ మెఱసి
యమ్మహావిష్ణువామనత్వమ్ము ననుక
రించునంభోజమిత్రుమరీచిజాల
మడఁచుఁ గావుతఁ బుడమిలో నిడుమ లెల్ల.

## 3

సీ. దారిద్ర్యదుఃఖసంతప్తనిర్భాగ్యజీ
వనులపాలిటి తప్తకనకధార
యాజవంజవదుర్గమారణ్యపథగతి
గ్లానిపీడితుల కాలంబయష్టి

యమరావతీని వాసాశాసమాదృత
క్రతుపరాయణులకు రాజవీథి
పరతత్త్వదర్శనత్వరమాణమానస
తిమిరాపనోదనదీపమాల
గీ. నిర్వికల్పసమాధిసంస్థితమునీంద్ర
తనుగృహద్వారపాలకదండ మైన
బాలభానుమరీచి సంప్రార్థితార్థ
సిద్ధు లొడఁగూర్చి మిమ్ము రక్షించుఁ గాక.

4

సీ. సప్తర్షిదత్తార్ఘ్యజలధారలకుఁ బద్మ
రాగమాలికల విభ్రమ మొసంగి
నాగమీఁది వినతాతనూజారుణచ్ఛాయ
కధికారుణత్వమ్ము నావహించి
రథవాజివక్త్రపార్శ్వములఁ ఖలీనక్షు
తాస్రరేఖాకార మధిగమించి
మార్గగోచరశైలమహితమూర్ధములందుఁ
దపనీయశేఖరత్వము భజించి

గీ. యష్టదిగ్యామినీప్రాతరంగరాగ
రచన కనుకూలకుంకుమద్రవముఁ గూర్చి
విశదవాసరముఖము లై వెలుఁగుభాను
దీధితు లొసంగు నాత్మసందీప్తి మీకు.

**5**

సీ. పఱతెంచుచున్న దా ? పద్మరాగపరాగ
రంజితమేరుపర్వతతటమ్ము
ఆడుచు నున్న దా ? యరదమ్ముపై మహో
రజతచిత్రిత మైనధ్వజపటమ్ము
క్రాలుచు నున్న వా ? రథవాహధుతశిరః
స్థలచిత్రమాంజిష్ఠచామరములు
జాల్వారుచున్న దా ? క్షుతదేహమందేహ
వదననిర్గతరక్తవారిధార
గీ. యనుచు బహువిధశంకాసమాకులముగ
జగము వీక్షింపఁ దోతెంచుసవితృనుదయ
కాంతిపటలము దుష్కృతధ్వాంతలయము
లయ మొనర్చుత ధర్మవిప్లవము లెల్ల.

## 6

సీ. వికచపంకరుహప్రవేశదోహలమత్త
పుష్పంధయముల కామోదభరము
విప్రయోగవ్యథావికలమానసచక్ర
వాకసుందరికి సౌభాగ్యగరిమ
యస్తంగమితచేతనాంతఃప్రభావదు
స్తామసచ్ఛటల కుత్పాతఘటన
నిద్రాతమోవశాంధీభూతనేత్రయు
గ్మమ్ములకుఁ స్వప్రకాశమహిమ
గీ. వర్ణనాతీతనానాప్రభావదివ్య
ధామసంఘాతమార్తాండనామమహము
సర్వజాంతవజీవరక్షాసమర్థ
మదిగో! యుదయించు నుదయధరాగ్రసీమ.

## 7

సీ. శీతార్తిఁ బాపుసంజీవిగాఁ దొలిగట్టు
చఱియందు మొలచునోషధి యనంగ
నుభయసంధ్యోపాసనోర్జస్వులకు బ్రాహ్మి
చాచినయభయహస్తం బనంగ

గీ. వాలఖిల్యాదితాపసవ్రతివితతికి
నమృతపారణసంతర్పణము పొనర్చి
యవిగొ ! సాఁగుచు నున్నవి యబ్జహితుని
కరసహస్రము లంతరిక్షమ్మునందు.

**9**

సీ. సమయపరిజ్ఞానచతుర మౌద్విజకుల
కలకలమ్ములు వీనుగవ నదించెఁ
గుంకుమాంకిత మయ్యె గోరోచనాశుద్ధి
పరిపూత మైనదిక్ప్రాంగణమ్ము
ఉత్సృష్ట మయ్యె నభ్యుదయాప్తిమూలభూ
త మ్మైనతరుణగోదశశతమ్ము
కమలగర్భాగారకఠినబంధవిముక్తి
లభియించె మత్తరోలంబతతికిఁ
గీ. త్రిభువనప్రాణిరక్షణదీక్షితుండు
ఋగ్యజుస్సామమంత్రకీర్తితమహుండు
అఖిలదేవమయుండు మార్తాండనామ
పుత్త్రిఁ డుదయించెఁ బ్రాగ్దిశాపుణ్యసతికి.

గీ. వాలఖిల్యాదితాపసవ్రతివితతికి
నమృతపారణసంతర్పణము పొనర్చి
యవిగో! సాఁగుచు నున్నవి యబ్జహితుని
కరసహస్రము లంతరిక్షమ్ము నందు.

**9**

సీ. సమయపరిజ్ఞానచతుర మౌద్విజకుల
కలకలమ్ములు వీనుగవ నదించెఁ
గుంకుమాంకిత మయ్యె గోరోచనాశుద్ధి
పరిపూత మైనదిక్ప్రాంగణమ్ము
ఉత్సృష్ట మయ్యె నభ్యుదయాప్తిమూలభూ
త మ్మైనతరుణగోదశశతమ్ము
కమలగర్భాగారకఠినబంధవిముక్తి
లభియించె మత్తరోలంబతతికిఁ
గీ. త్రిభువనప్రాణిరక్షణదీక్షితుండు
ఋగ్యజుస్సామమంత్రకీర్తితమహుండు
అఖిలదేవమయుండు మార్తాండనామ
పుత్త్రిఁ డుదయించెఁ బ్రాగ్దిశాపుణ్యసతికి.

## 10

సీ. విశ్వసృష్టికి ముందు వెల్గొందు నేకాంత
సత్పదార్థమ్ము బీజమ్ము గాఁగఁ
బ్రకృతిసంసర్గప్రభావరంజిత మైన
ప్రథమరూపం బంకురంబు గాఁగఁ
బ్రతిని మేషోన్మిషత్ప్రచురారుణచ్ఛాయ
పల్లవ స్తబకసంప త్తి గాఁగ
ధగధగాయితత ప్తతపనీయదండాభ
భానుజాలము విటపములు గాఁగ
గీ. సకలపురుషార్థములు ఫలసముదయముగఁ
దనరు నల్లదె గగననందనమునందు
సూర్యకల్పద్రుమమ్ము తేజోఘనమ్ము
బ్రహ్మవర్చసభాగ్యసంవర్ధనమ్ము.

★

# గంగాలహరి

**1**

చ. కలుములపంట భూమికి,
జగత్ప్రభు శర్వుని భాగ్యరేఖ, ప్రాఁ
బలుకుల యర్థసారము,
సుపర్వుల పుణ్యము తాల్చురూపు, నె
చ్చెలి సుధకుఁ, బురాణకవి
శేఖరవాక్యవిహారవాటి, నీ
సలిలము నా పొనర్చు
కలుషమ్ముల నెల్లఁ దొలంచు జాహ్నవీ!

**2**

చ. సకృదవలోకనశ్రవణ
సంస్మరణమ్ముల, దుష్టవాసనా
నికరతమఃప్రసారమలి
నీకృతబోధమనోవిమోహముల్

విక‌ల మొనర్చుగాంగజల
వీచిపరంపర యస్మదీయపా
తకము లడంచి శాంతియును
దాంతియు నిచ్చి సుఖాత్ముఁ జేయుతన్.

3

చ. హరు శిరమందు నిన్నుఁ గని
యంబిక పట్టఁగ రాని యీసునన్
జురచుర లాడుచున్ గఱకు
చూపులు నీ దెసఁ బర్వఁ జేయఁగా
నుఱిమియుఁ బొంగియున్ బొరలి
యున్ నురుగుల్ వెలిఁ గ్రక్కియున్ భయం
కరముగఁ దాండవించుతరఁగల్
భవతాప మడంచు జాహ్నవీ!

4

చ. దురితము లెన్ని చేసినను
దోడనె నీవు భరింతు వన్నని
బ్బరమున గర్వితుండ నయి
పద్మభవాదుల ధిక్కరించితిన్

దటి యగునిప్డు నిష్కృతి
యొనర్పక నీవె యుపేక్ష సేయ నె
వ్వరి నిఁక వేఁడుకొందు ?
వినువా రెవ రుందురు నన్ను జాహ్నవీ !

5

గీ. తలఁచినంతనె యెట్టి సంతప్తులకును
జిత్తశాంతి యొసంగువిచిత్రచరిత
యమరసంసేవ్యసలిల జాహ్నవి తొలంచుఁ
బరమకృపతోడ నాదు తాపత్రయమ్ము.

6

గీ. ప్రాజ్యరాజ్యమ్ము నొక గడ్డిపరకవోలె
వ్రేల్మిడిఁ ద్యజించి నీదరి విశ్రమించి
యమృతరుచి మించు నీసలిలములు గ్రోలు
వారు కోరరు వేఱె నిర్వాణపదము.

7

గీ. ప్రాతరవగాహములు సల్పు రాచచెలుల
మేనికస్తురి నీనీట మిళిత మగుచుఁ
గస్తురిమృగమ్ములకు నిచ్చుఁ గల్పవాటి
నమరరమణీసమేతవిహారసుఖము.

## 8

గీ. జీవితాంతమునందు నన్ వెనక వచ్చు
శమనుదూతకు నుచ్చాటనముగ, వదన
రంగమునఁ దాండవించుత గంగ యనెడి
యద్వయానందనామాక్షరద్వయంబు.

## 9

గీ. అంత యేఁటికి ? నీతీరమందుఁ దిరుగు
కాకముల కైనఁ గల్గదు నాకవాంఛ
జననమరణవిపద్దుఃఖశమనధీర
జాహ్నవీతీర మడఁచు నాశ్రమభరంబు.

## 10

గీ. వేదవాక్యమ్ములకు, శాస్త్రవాదములకు
దూర మై, వాఙ్మనోతీత మై రహించు
నిత్యశుద్ధనిరంజననిర్వికార
తత్త్వ మన నీవె, యిదియె సిద్ధాంత మంబ !

## 11

ఉ. దానములుఁ వితానములు
ధర్మములుఁ జపముల్ తపమ్ములుఁ
ధ్యానములుఁ వ్రతమ్ములుఁ
బ్రయాసకరమ్ములు, నిత్యనిర్వృతి

స్థానముఁ జేర్పఁ జాలని
వృథాయతనమ్ములు, సర్వజంతుసం
తానము నుద్ధరింపఁ గల
తల్లికి నీ కెన గావు జాహ్నవీ!

చ. శిశిరకటాక్షవీక్షణము
చేతనె సంసృతితాప మార్పు నీ
కుశలత యుగ్గడింపఁ
గలకోవిదుఁ డెవ్వఁడు, దాననే కదా
పశుపతి యుత్తమాంగమునఁ
బ్రాణపదమ్ముగ మోయు నిన్ను, న
ర్ధశివకు భ్రూవికారమును
రక్తదృగంచలముల్ జనింపఁగన్.

## 13

చ. పతితుల కైన లజ్జయును,
వ్రాత్యుల కైనను రోఁతయున్, నిరా
కృతులకు నైన భీతి
గలిగించుజగజ్జనకిల్బిషంబులన్

సతము హరింపఁగా విసువు
　　　　శ్రాంతి యెఱుంగనితల్లి వీవె, దై
వతకులవర్ధనీ ! భువన
　　　　పావని ! నీకు జయమ్ము గావుతన్.

## 14

గీ. ఉదుటునన్ మర్త్యభూమికి నుఱుకునిన్ను
నీలకంఠుఁడు జడలలో నిల్పె నన్న
నిస్పృహుల కేనియున్ లోభనీయ మైన
నీదు గుణసంపదున్నతిన్ గాదె జనని !

## 15

ఉ. కాలును జేయియున్ జెవియుఁ
　　　　గన్నును లేక యభాగ్యజీవయా
త్రాలసు లైనవారిని,
　　　　గ్రహస్థితి చాలనివారి, వెజ్జులున్
వేలుపులున్ నమోఽస్తనుచు
　　　　వేసరి రోసినవారి, జాడ్యని
ర్మూలనుపొందెు నీ జలముఁ
　　　　గ్రోలఁగ నిమ్ము మహౌషధమ్ముగన్.

## 16

చ. పులకితగాత్రు లై సగర
పుత్త్రులు స్వర్గమునుండి నేఁటికిన్
సులలితగీతికాసరణి
స్తోత్ర మొనర్చుచు నుంద్రు, స్వచ్ఛశీ
తలమధురమ్ములున్ దురిత
తాపహారమ్ములు నైన నీ జలం
బుల మహిమంబు మాదృశ
విమూఢుల కెట్లు నుతింప నయ్యెడిన్.

## 17

ఉ. నేరిచి నేరమిన్ మనసు
నిల్పఁగ లేమిని గొంచెపున్ దురా
చారపథమ్ము ద్రొక్కియును
స్వాంతమునం దనుతప్తు లైనసం
సారుల నుద్ధరించుటకుఁ
జాల నదుల్ గల వెందు, నప్రతీ
కారమహౌఘనిస్తరణ
కార్యచమత్క్రియ గంగకే తగున్.

## 18

ఉ. స్థానము మోక్షలక్ష్మికి,
నిధానము ధర్మమహత్తకున్, దిరో
ధానము మందబుద్ధికి,
విధానము మానసతుష్టికిన్, సమా
ధానము మేధకున్, సుపరి
ధానము ధాత్రివధూటికిన్, మహా
ధానము శ్రీకి నీతనువు
తాపహార మ్మగు నాకు జాహ్నవీ!

## 19

చ. ధనమదిరామదాంధు లగు
దంభనరాధిపులన్ భజించుచున్
దినదిన మెన్నియో సలిపితిన్
బరితాపము గొల్పుదుష్కృతుల్
నిను విడనాడుకొంటి జననీ!
తనమేలు గ్రహింపనట్టి మూ
ర్ఖుని యపరాధముల్ తడవి
రోయక చల్లనిచూపు చూడుమీ.

## 20

ఉ. కేళివిలోలనిర్జరమృగీ
నయనాతనులేపగంధజం
బాలితముల్, మరుల్లులిత
పద్మరజఃపటలీపిశంగముల్,
బాలజలేజబాంధవవిభా
ద్రవమూర్తులు నీజలమ్ము లీ
బాలిశు భావిసంజనన
బాధలకున్ దొలఁగించుఁ గావుతన్.

## 21

సీ. జననమా? విశ్వవిశ్వంభరాభరణుఁ డౌ
నారాయణుని పాదనలినమందు
ఆవాసమా? భూధరాత్మజాక్రాంతవా
మాంగుఁ డౌ భవునుత్తమాంగమందు
వర్తనంబా? మాదృశార్తమానవసము
ద్ధరణదీక్షాపుణ్యతంత్రమందు
మహిమమా? సంస్పర్శమాత్రసర్వప్రాణి
జాడ్యాపనోదకౌశలమునందు

గీ. శాపపరిదగ్ధసగరరాజర్షి సుతులఁ
బుణ్యభువనమ్ము సేర్చుట ముఖ్యలీల
గంగ యనునక్షరములె యుత్కర్ష నిధులు
అన్యవర్ణన లెల్ల నిరర్థకములు.

## 22

చ. కనుమలనుండి సాగర
ముఖమ్ముగఁ బాఱునదుల్ మహీతలం
బున శతముల్ సహస్రములు
హా ! నినుఁబోలెఁ బురారిమూర్ధసీ
మను నిలువంగ నేర్చెనో ?
రమాధవుపాదరజంబు పావనం
బొనరుపఁ గల్గెనో ? త్రిభువ
నోచితసంచరణంబు సల్పెనో ?

## 23

సీ. కను మూసికొని నిర్వికల్పసమాధిలోఁ
బడి యుండఁగా నిమ్ము పద్మభవునిఁ
గలశవారిధితరంగములు జోలలు పాడ
శయనింపఁగా నిమ్ము శార్ఙ్గధరుని

నందిముఖ్యులు రసోన్మత్తు లై జయపెట్ట
నాడఁగా నిమ్ము చంద్రార్ధధరునిఁ
బౌలోమితోఁ గల్పపాదపచ్ఛాయల
విహరింపఁగా నిమ్ము వేల్పుఱేని
గీ. దానధర్మాదికర్మతంత్రముల గుప్త
ధనముగా నుండ నిమ్ము శాస్త్రమ్ములందె
యైహికాముష్మికము లైన యఖిలఫలము
లొసఁగుతల్లివి నీ వుండ నొరులఁ గేల ?

## 24

సీ. దిక్కు తోఁచనియట్టి దీనాత్ముఁడను నేను
క్షేమమార్గప్రదర్శినివి నీవు
చింతాసమాకులితాంతరంగుఁడ నేను
జాంచల్యభంజనౌషధము నీవు
పరమతృష్ణాతురస్వాంతుండ నేను, సం
పూర్ణదయామృతపూర మీవు
మారవికారాంధకారమగ్నుఁడ నేను
వైరాగ్యరత్నదీపంబ వీవు

గీ. తనయుఁడను నేను, లోకైకజనని వీవు
అనద నై, నిస్సహాయుఁడ నై కరావ
లంబ మర్థించి 'పాహి, పాలయ' యటంచుఁ
జెంత నిలిచితి, నేమి చేసినను మేలె.

## 25

సీ. సంకులాక్రోశభీషణరావభరిత మౌ
శమనునివీడు నిశ్శబ్ద మయ్యెఁ
జిత్రగుప్తుఁడు పిల్చి చీకొట్ట యమభటుల్
సురిఁగి పోయిరి పరాసువుల వెదక
నమరావతీవీథు లన్నింట దిగువిమా
నముల సమ్మర్దము లమిత మయ్యె
నతిథిపూజాపరాయణలైన యచ్చర
తీవబోండ్లకుఁ జేయి తీర దయ్యె
గీ. నెపుడు పుడమికి దిగితివో ? యెపుడు జనులు
చెవులు చల్లఁగ నీకథల్ చెప్పికొనిరొ ?
యాద్యు లౌనార్షకవులు ని న్నధికరించి
యెపుడు గానము చేసిరో యపుడె తల్లి !

## 26

చ. తలఁపఁగ హేయ మౌ మదన
దాహము పేరి మహోజ్వరమ్ముచే
సలసల గ్రాఁగి దేహము
భృశమ్ము కృశించిననన్నుఁ బోలునా
ర్తులపయి జాహ్నవీవిమల
తోయకణార్ద్రసమీరపోతముల్
పొలసి శరీరతాపశమ
ముఁ గలిగించు మనోజయమ్ముతోఁ

## 27

గీ. పదియునాలుగు భువనాల భవన మైన
కమలజాండము నీ తరంగముల నడుమ
తుమికిపండు విధంబుగా దొరలుచుండు
వ్యోమకేశుని ఘనజటావ్యూహమందు.

## 28

ఉ. నన్ను విధూతకల్మషు
నొనర్పఁగ లేక సమస్తతీర్థముల్
ఖిన్నతఁ జెంది సిగ్గుపడెఁ,
గేల్ సెవిఁ జేర్చిరి నాదునామముఁ

విన్న 'నిసీ' యటంచు
నరవిందభవాదులు, నీకుఁ దక్కఁతిఁ,
నిన్ను భజించుఁ గాక
యఘనిర్దళనప్రతిభాజయోన్నతుల్.

## 29

గీ. శ్వపచు లైనను సలుపఁ జాల్పడనిఘోర
పాపపుంజమ్ములనకు నేకభవన మైన
నన్ను నీ వుద్ధరింపఁగా నడుము గట్టె
దమ్మరో! యెట్లు శ్లాఘింతు నమ్మ! నిన్ను.

## 30

ఉ. 'ఒక్కరుఁ డేని లేఁ డొకొ
దురుద్ధరపాపుఁడు, వానినే జగం
బక్కఁజ మందఁ బ్రోవ
వలె' నన్నది నీ చిరకాలవాంఛ, నే
నొక్కఁడ నట్టివాఁడ నిది
గో! చనుదెంచితి నన్నుఁ బ్రోచి నీ
మక్కువ తీర్చికొ మ్మఖిల
మానవలోకము విస్మయంపడఁ.

## 31

చ. నిలుకడ లేనిబుద్ధియును,
నీతివిదూరచరిత్ర, పొట్టకై
తులువల నాశ్రయించుటయు,
దుర్జనమైత్రియుఁ, గొండెముల్, మృష
ప్రలపనముల్, కుతర్కములు
బాల్యమునుండియు నాకు నైజ మీ
ఖలుని ముఖ మ్మొవండు
సుముఖమ్ముగఁ గన్గొను నీవు దక్కఁగన్

## 32

గీ. కన్ను లున్నఫలం బేమి? కాంచ లేని
నిత్యనూత్నమ్ము నీ రామణీయకమ్ము?
వీను లున్నఫలం బేమి? వినర యేని
గమకమధురమ్ము నీ కలకలరవమ్ము.

## 33

గీ. పుణ్యులకు స్వర్గసుఖము, పాపులకు నరక
బాధ యనియెడిధర్మవిభాగ మఖిల
పాపహారిణి గంగాభవాని లేని
యశుభమయ మైనదేశమ్మునందె చెల్లు.

## 34

ఉ. వేదషడంగపారగుని

విప్రునిఁ ద్రుంచియుఁ, బుత్త్రినిర్విశే

షాదృతిఁ జూపుదేశికు

గృహమ్మున కెగ్గు దలంచియున్, దుదిన్

నీదరి దేహ మూడ్చి

జననీ! చను నమ్మ నరుండు యజ్ఞసం

పాదితపుణ్యు లైన

యజమానులు పోవుమహాపథమ్మునన్.

## 35

గీ. విరహిణీప్రాణములను గ్రోవ్వీరుల సౌర

భమును హరియించుక్రూరస్వభావుఁ డయ్యు

నీ జలస్పర్శశుద్ధుఁ డై నిఖిలజగము

పావనము సేయుచున్నాఁడు పవనుఁ డంబ!

## 36

గీ. ఇహసుఖ మ్మొనిఁ బరసుఖ మ్మొనిఁ గోరి

పురుషకార మొనర్తురు నరులు సతము

నేను భువనద్వయభరమ్ము నిన్నె పూన్చి

యుఱక సుఖముగ నిదురించుచున్నవాఁడ.

## 37

గీ. నరకగహ్వరపతితసంత్రాణమందు
నీకు నెంతటి ప్రీతియో, నాకు నంతె,
నరకపతనోన్ముఖం బైననడకయందు,
నైజ మెవ్వరి కేని మానంగ రాదు.

## 38

ఉ. వాసుకిభూషణుండు
రసవన్మతిఁ దాండవకేళి సల్పు సం
ధ్యాసమయమ్మునన్ బ్రతిగఁ
దాను నుదీర్ణతరంగహస్తవి
న్యాసములన్ భ్రమిభ్రమణ
నవ్యగతిస్ఫురణంబులన్ మహో
ల్లాసము దోఁప జహ్నుసుత
లాస్యము సల్పుటఁ బ్రస్తుతించెదన్.

## 39

ఉ. నాసుఖ మైనఁ గష్ట
మయినన్ భవదీయభరమ్ము గా సమా
శ్వాసితబుద్ధి నై బరవ
సమ్ము మెయిన్ మనుచుంటి, డెప్పరం

బీసమయమ్ము ; నన్నుఁ
దృజియించెద వేని జగాన భక్తివి
శ్వాసము లస్తమించునొ ?
యసారము లౌనొ ? దయాస్వభావముల్.

## 40

గీ. అర్ధనారీశుజడల నీ వాడునపుడు
పొరలి గిరికన్యసీమంతమును స్పృశించు
చిఱుతరఁగ నామె కోపరంజితదృగంత
యగుచు విదిలించుటలు నవ్వులాట నీకు.

## 41

ఉ. కోరినకోర్కు లేవొ యొనఁ
గూర్చెద వన్నయపేతుచేత నీ
తీరమునందుఁ జేరుదురు
తీర్థపరుల్ నిరతంబు, నాకు నే
కోరిక లేదు నిన్ గొలుచు
కోర్కి వినా తొలినుండి, పూర్వసం
స్కారఫలమ్మొ నీపరమ
కారుణికత్వఫలమ్మొ జాహ్నవీ !

**42**

గీ. మోహతమము హరించు క్రొంబ్రొద్దుపొడుపు,
బ్రహ్మ వ్రాసిన దుర్వర్ణపంక్తి తుడుపు,
కాలునకుఁ జుక్క యెదురు, దుష్కర్మబెదరు,
గాంగమృత్తిలకమ్ము మోక్షప్రదమ్ము.

చ. జనపదవాసముం విడువఁ
జాలనివారి హసించుచున్నవో
యన సుమమంజరుల్ విరియ,
నాసుమసౌరభ మాని తుమ్మెదల్
తనుకలుషమ్ముఁ బాసి శుచి
తారుచిరాకృతులం వహింప, స్వ
ర్ధుని యిరుప్రక్కలం గల
తరుప్రతతుల్ చెలికాండ్రు నా కగుం.

గీ. పరమనిర్దయు లైనదేవతలఁ గొలిచి
కఠిననియమమ్ము లైనయోగముల నిలిచి
బాధ పడ నేల? నీ నామభజనమందె
నిఖిలముం గాంతు, జగముఁ దృణీకరింతు.

## 45

ఉ. ఎన్నఁడుఁ బాపచింత
యుదయించి యెఱుంగని పుణ్యశీలసం
పన్నుల నాదరింపఁగ
సమర్థులె సుమ్ము సమస్తదేవతల్
ఎన్నఁడుఁ బుణ్యచింత
యుదయించి యెఱుంగని పాపశీలసం
పన్నుల నాదరింపఁగ
సమర్థులు లే రొక నీవు దక్కఁగన్.

## 46

ఉ. ఇల్లును వాకిలిన్ మఱచి
యియ్యెడ నయ్యెడఁ దోఁచినట్లుగా
నల్లరిజట్టుతోఁ దిరిగి
యాపదలం బడి యిల్లు సేరితిన్,
దల్లికి బిడ్డ భార మగునా ?
నను నంకమునందుఁ జేర్చి నీ
చల్లని వాయువీజన
వశంబున శ్రాంతిఁ దొలంగఁ జేయుమా.

## 47

గీ. చంద్రమకుటము నురగభూషలును దాల్చి
యాలసింపక లేవఁ గదమ్మ తల్లి!
అన్యులుం బోలె నీవును నపహాసింపఁ
జనకు మమ్మరో ? యుద్ధారసమయ మిద్ది.

## 48

ఉ. బాలశశాంక శేఖరము,
పాండుదుకూలవసానముఁ, శర
త్కాలసుధామరీచి
సుభగంబును, వాసుకికంకణంబు నై
నాలుగుచేతులఁ నిధులు
నాలుగు తాలిచి నక్రపీఠిపైఁ
గ్రాలెడిమంగళాకృతిని
గన్నుల నిల్పి భజింతు జాహ్నవిఁ.

## 49

చ. దరహసితాస్యకాంతులు
సుధాఝరు లై దెస లెల్ల నిండ సం
సరణదవాగ్నితప్తులకు
శాంతిసుఖమ్ము లొసంగఁ జిత్కళా

కిరణసముచ్చయంబులు
వికీర్ణము లై శరదిందుచంద్రికా
స్ఫురణ వహింపఁ దేజరిలు
మూర్తికి జాహ్నవికిఁ నమస్కృతుల్.

## 50

సారహీనము లయ్యె భేషజము లెల్ల,
మాట తడఁబడి పోయెను మంత్రములకు,
నప్పగించెను గన్నుల నమరగణము,
తల్లి ! నీదయ మిగిలె నా తాప మార్ప.

## 51

సీ. తననేర్పు తనసంపద యెఱింగి నీతోడ
నాదిభిక్షువు జూద మాడు టేల ?
ఆడెఁ బో ! పైబట్టతోడ సర్వస్వమ్ము
నోడియుఁ బ్రమథుల నోడు టేల ?
ఓడెఁ బో ! యంతతో నూరకుండఁగ లేక
తన్నుఁ దా నొడ్డఁగాఁ దలఁప నేల ?
తలఁచెఁ బో ! భూధరాత్మజ యెంతొ చకిత యై
క్రీఁగంట నిన్ను వీక్షించు టేల ?

గీ. సవతియే యగుఁ గాక నీ సాటిసతిని
జిన్నబుచ్చఁగ లహరులచిందు లేల ?
మనసు పట్టఁగ లేక యీమాట లంటి,
జనని ! మీ లీల లెఱుఁగ నెవ్వని తరమ్ము ?

## 52

గీ. సంగతానంగశత్రూత్తమాంగ గంగ
రంగదుత్తుంగవిపులతరంగ గంగ
భర్జితాఖిలసత్తపోభంగ గంగ
యమలిన మొనర్పుఁ గాక నా యంగకములు.

## 53

ఉ. పాలితశబ్దధర్ముఁ డగు
పండితరాయల భక్తిభావనో
ద్వేలసురాపగాస్తుతికిఁ
బింగళి కాంతుని యాంధ్ర మిద్ది, గం
గాలహరీభవప్రణవ
నాదసుధారసపానమాధురీ
లోలుపచిత్తులై నకవులున్
బుధులున్ సుఖయింత్రు గావుతన్.

★

# అన్యాపదేశలహరి:

## భ్రమరగీతి

**1**

గీ. పండ్లరుచులును బూవులపరిమళములుఁ
దెలియఁ గలవార లెందఱో కలరు గాక
పూవుదేనెల తీపిని బోల్చి చూడ
దక్షు లెవ్వార లొక మిళిందమ్ము గాక !

**2**

గీ. వికచనళినీమనోరథప్రియతముండు
కుముదినీకేళిలోలుఁ డీ భ్రమరరాజు
కాలవశమునఁ బరదేశగతి లభించి
యడవిమల్లెల తేనెకై యాస సేయు.

**3**

సీ. తీపు లూరంగ మాధ్వీక మాస్వాదించి
కైపుఁ గొంటివి మధూకమ్మునందు
వికసితదళగళన్మకరందమునఁ జొక్కి
శయనించితివి సరోజమునయందుఁ

ప్రసవగుళుచ్ఛసౌరభవాహినీనిమ
జ్జనము సల్పితివి రసాలమందు
మృదుతరావయవపరిష్వంగపారవ
శ్యమ్ము నొందితివి వాసంతియందు
గీ. నీదు సౌభాగ్య మిట్టిది కాదె భ్రమర!
యెట్లు మఱచితి వద్దాని, నెట్టు లిచటఁ
గుటజముల ప్రాలి క్రీడింపఁ గోరుచుంటి
వేటి కింత దురావేశ మిపుడు నీకు.

## 4

గీ. తొలఁగి చను మోయి! మధుకరా! దూరమునకు
సురభిళం బంచుఁ గేతకీసుమము చొఱకు
అచట లవ మేని మధువు లభ్యమ్ము కాదు
అది యటుండఁగ ధూసరం బౌను మేను.

## 5

చ. పరిమళమున్ సువర్ణమును
పద్మపుఁ గ్రాంతి ఘటింప ముగ్ధబం
ధర మొక కేతకీకుసుమ
మధ్యదళమ్ముల వచ్చి వ్రాలఁగా

హరి ! హరి ! పూదుమారమున
నంధము లయ్యెను నేత్రముల్, గఱుల్
చిటిగెను ముండ్లచే, నిలువ
లేదు, తొలంగను లేదు నెచ్చెలీ !

6

గీ. భ్రమర మొక్కండు పరిఫుల్లపద్మగృహము
సొచ్చె మధులోభమున ముందుచూపు లేక
యక్కటక్కట ! యెంత దురంత మయ్యె
మంచుతాకున నది ముకుళించుకొనియె.

7

గీ. రేయి కడచను, దెల్లవాఱెడిని దూర్పు,
అరుణుఁ డుదయించు, హసియించు నబ్జలక్ష్మి
యనుచుఁ గోరకబద్ధ మౌనళి తలంచు
నంతలో దంతి కమలిని నపహరించె.

8

గీ. ఆఁకట నలంగి కింశుక మనెడిభ్రాంతి
నాప్పలించినశుకముఖమందుఁ జొచ్చి
తనదు నవివేకమును దూఱుకొనుచు బ్రతికి
బయటఁ బడఁ గొట్టుకొనుచుండె భ్రమర మొండు.

## 9

గీ. పద్మవనమున రాత్రుల బంధనమ్ము
దంతికటదానమునఁ గర్ణతాడనమ్ము
చంపకసుమమ్మునన్ ఘ్రాణసంశయమ్ము
భ్రమరమున కొక్కయెడను భద్రమ్ము లేదు.

## 10

గీ. తుమ్మెదా! చూడవా యేమి? తూర్పుదెసను
జదల వెలుఁగుచు నున్నాఁడు చంద్రముండు;
వారిజ మ్మింతకే నిద్రఁ గూరి యుండుఁ,
జనకు మచటకు నిష్ప్రయోజనము తుదకు.

## 11

చ. పటగతపద్మరూపమును
వర్ణమునన్ మది మెచ్చు గొల్పు ము
చ్చటపడి వచ్చి వ్రాలె నొక
చక్కనిభృంగకుమారరత్న, మ
చ్చట రసమున్ మృదుత్వమును
సౌరభమున్ గన రామి సిగ్గు
క్కుటమయి మోము వంచికొని
ఘూర్ణిలుచున్ జనియెన్ యథాగతిన్.

## 12

చ. సమదకరీంద్రగండమద
సారవివర్ధితసత్వముల్ దళత్
కమలరజోంగరాగ
పరికల్పితగాత్రపరీమళమ్ము శ్రీ
భ్రమరము లిప్డు దైవ
పరిపాకము చాలమిఁ జేసి నింబవృ
క్షములను, జిల్లెడుంబొదలఁ
గాలము పుచ్చుచు నుండె దీనతన్.

## 13

గీ. నందనోద్యానమందారనవగుళుచ్ఛ
సౌరభపరాయణ మ్మైనషట్పదంబు
గడ్డిపూవుల మూరొ్కనుగతికి వచ్చె
విధివిడంబన యేమి గావింప లేదు.

## 14

గీ. ఇచట వాసంతహైమంతఋతుమహోధి
పత్యమేళనద్వైరాజ్యవశత నేమొ !
కుందమునఁ గాని, మాకందమందుఁ గాని
కాలు మోపదు తుమ్మెద కలత్రఁజెంది.

## 15

గీ. కోమలలవంగలతపయిఁ గూర్మి మాని
పూలకొమ్మల లాలించుబుద్ధి యుడిగి
వినరెఁ గొంగ్రొత్తమధురకవిత్వగీతి
మావిమొగ్గను జూచినమధుకరమ్ము.

## 16

గీ. మంజుగతి గీతి వినిపింప మధుకరమ్ము
మాలతీ! తాల్చె దేల కుట్మలపుముద్ర
యెవ్వ రనుకొంటి? శిరసావహించు నితని
దాననిధు లైననందనోద్యానతరులు

## 17

గీ. పారిజాతము తనకంటెఁ బడెడువఱకె
ద్రుమము ద్రుమమునఁ దిరుగు మధువ్రతమ్ము;
భారతకవిత్వరుచి పట్టువడెడువఱకె
యితరకావ్యాలు తడవు సాహిత్యపటువు.

★

## పద్మవనము

**1**

గీ. నీరు భేదించుకొని మొగ్గ నిగుడు టొకచె
తమ్మి పొనరించుకొనెడికృత్యమ్ము తనకు
వికసనామోదలక్ష్మీప్రవేశకలన
యాదిగా నబ్జహితుని కృత్యములు తుదకు.

**2**

సీ. జనన మొందితి స్వచ్ఛజలపూరితం బైన
స్వర్గాపగాతుల్యసరసియందు
భరియించితివి మేన సురసుందరీఘ్రాణ
పరితర్పణం బైనపరిమళంబు
పుట్టిల్లు మఱపించుమురిపెంపుగృహ మైతి
కల్యాణనిధులతోఁ గలిమిచెలికి
వెల లేనినగ వైతి విశ్వరక్షణకళా
శస్త్ర మౌమురవైరిహస్తమునకు

గీ. నళికులమునకు సురుచిరాహార మొసఁగు
కల్పలత వైతి వీగుణోత్కర్ష మెల్ల
వన్నె కెక్కను ద్విజకులాభరణ మైన
హంసయెడఁ బ్రీతి గల వేని యంబురుహాను!

3

గీ. సరసిజాసను జననంబు, సరసిజాతు
నాదరంబును, సరసీరుహాప్త చెలిమి,
కలిమిచేడియ యునికియుం గలిగి యేమి?
తొలఁగ దయ్యెను తమ్మికిఁ దుహినపీడ.

4

గీ. కలువ నినుఁ జూచి హసియింపఁ గనక మున్నె
భానుకరములు నిను స్పృశింపకయ మున్నె
విం దొనర్పుము తేనె మిళిందమునకుఁ
బ్రాఁతపడ నీకుమా! సుంత పంకరుహామ!

గీ. తేనెపై నాప నీచుట్టు తిరిగి యిచ్చ
కాలపాటలు పాడుభృంగములు పెక్కు
జలజమా! సర్వనిరపేక్షసౌరభమును
గడలఁ బచరించుసఖుఁ డొక్క గంధవహుఁడె.

**6**

గీ. అమృతకరు నెన్నఁడును జూడ దయ్యెఁ గాన
నిష్ఫలం బయ్యెఁ బో! నళినీభవమ్ము
అంబుజవికాసమును జూడఁ డయ్యెఁ గాన
వ్యర్థ మయ్యెను బో! యమృతాంశుభవము.

★

## జలధరార్భటి

1

చ. అదె కనుఁగొమ్ము వారిద !
విహంగము లెల్లఁ బిపాసచే నదీ
నదసరసీతటాకభువ
నమ్ములకుꣳ బఱువెత్తుచున్నవే
కద ! యిటు చాతకమ్మొ
నినుఁ గాక మఱొందెడఁ జేరఁ బోదు,
డదు, మొగ మెండి పోఁ దగిన
డప్పి జనించియు నెంత దీక్షయో !

2

గీ. చిరము తపియించి యుపవసించినది జలద !
చాతకమునకు గ్రుక్కెఁడుజలము లిమ్ము
క్షణము తూరుపుదెస గాలి సాఁగె నేనిఁ
జాతకం బేడ ? నీ వేడ ? జలము లేడ ?

3

గీ. రెండుమూఁడుకణమ్ములఁ దృప్తిఁ జెందు
చాతకమువంకఁ జూడవు, సకలజలము
వ్యర్థముగఁ గ్రుమ్మరించెద వబ్ధిలోన
జలదమా! నీ వివేకమ్ము సంస్తుతింతు.

4

గీ. అంతరిక్షంబునందు నీ కభిముఖముగ
శ్రాంతిమై నోరు తెఱచినచాతకమ్ము
జలముమాట య టుండనీ, శ్రవణపేయ
శబ్దమున కైన నోఁచదా? జలధరంబ!

5

సీ. హిమవర్షణోపద్రవము సైఁపఁగా లేక
పద్మసంపద యెల్లఁ బాడు వడియె
నీళ్లలో మునిఁగి మొండెములుగా నిల్చిన
నాళమ్ములను దంతి నమిలి వైచె
వలలు గాలాము లూఁతలతోడ దండెత్తి
జాలరి కొల్లాడె జలచరముల
గ్రీష్మభానుని చండకిరణజాలజ్వాల
లాహుతి గొనె నగాధాంబువులను

గీ. రూపు చెడి రేఖ మాసి సరోవరమ్ము
నామమాత్రావశేష మై నవసి యుండె
జీవనప్రదుఁ డన్న నీ పావనాఖ్య
సార్థకమ్ముగఁ బూరింపు మయ్య! జలద!

**6**

గీ. వారిధారాభిషేకోత్సవం బొనర్చి
జగతిపరితాప మార్పుము జలధరంబ!
కాద యేనియు దూరంబుగాఁ దొలంగు
మమృతకిరణుని దర్శనం బైనఁ గలుగు.

★

## దుర్జనతాడనము

1

గీ. పరుఁ డొనర్చెడి యుపకారఫలము లెల్లఁ
బాలవలెఁ బొట్ట నిండఁగాఁ గ్రోలి బలిసి
సమయమున్ జూచి యతనినే చంప వేచుఁ
బాపజాతి కృతఘ్నుండు పామురీతి.

2

చ. అడవులలోనఁ బచ్చిక
బయళ్ళ నిరాగసవృత్తిఁ గాలమున్
గడపెడిలేడి నాభిదెసఁ
గస్తురికాయ ఘటించి యూరకే
మడియఁగఁ జేయు మాయవిధి
మాయురె ! దుర్జనునాల్కమూలమం
దిడఁ డది యేమి ! సాధుజన
సృష్టి నిరామయమై సుఖించెడిన్.

3

గీ. వేదవేదాంతవిద్యాప్రవీణుఁ డయిన
దుర్జనున కించు కేని సద్బుద్ధి రాదు
మూఁడు యుగములు మున్నీట మునిఁగి యున్న
ధరణిధరమున కింత మార్దవము రాదు.

4

గీ. ఖలుఁ డొనర్చెడి దుష్కర్మఫలము సుజను
లనుభవించుట దేవరహస్య మేమొ ?
రావణుఁడు సీత నెత్తుక పోవు టేమి ?
వార్ధికి న కారణమ్ముగా బంధ మేమి ?

5

గీ. ప్రాణహరణప్రగల్భతాపరిణతమ్ము
లైనదారుణవస్తుచయమ్ములోన
నగ్రణి నటన్న యహ మేల హాలహలము !
ఖలుని నాల్కకు సాటి రాఁగలవె నీవు ?

*

## గజబృంహితము

1

సీ. విహరింపఁగాఁ బొమ్ము విపినవీధుల ఘటా

పరివారపరివృత ప్రాభవముగ

సవరింపఁగాఁ బొమ్ము జలకేళి కరిణీక

రోత్సృష్టకణసేచనోత్సవముగ

నారగింపఁగఁ బొమ్ము నోరూరఁ గడుపారఁ

గమ్మనైన మృణాళకాండభుక్తి

కావింపఁ బొమ్ము ఘీంకారపూర్వకము ప

ర్వతసానువులయందు వప్రకేళి

గీ. రాకు మీదెసకుఁ మృగరాజుమీఁది

సమరజయకాంక్ష మాతంగసార్వభౌమ!

కోరె దేనియు శుభము నీకుంభమునకు

నొల్ల వేనియు ముప్పు నీ యూధమునకు.

## 2

ఉ. దంతికులాధిపా ! యొక
హితమ్ము వచించెద నిల్వుమీ ! గజ
భ్రాంతిఁ గఠోరతీక్ష్ణ
నఖరప్రవిదారితగండశైలదు
ర్దాంతరుషోద్ధతుండు
మృగరాజిపు డిప్పుడె కూర్కుచుకై గుహా
భ్యంతరమందుఁ జొచ్చెను
మదాంధుఁడవై యటు చేరఁ బోకుమీ.

## 3

చ. ముదమున దానధారలకు
మూఁగి కటమ్ము లలంకరించుచు
మ్మొదలను గర్ణచాలన
సమీరహతిఁ భయపెట్టి చోపుచో
మదకరికిఁ స్వకీయకట
మండనహానియె కాని గందుతు
మ్మెదలకు నేమి చింత ?
యనిమీలితపద్మవనమ్ము లుండఁగ.

★

# సింహగర్జనము

**1**

గీ. మత్తమాతంగరాజకుంభస్థలంబు
శైశవమునందె చీల్చు కేసరికి నిప్డు
యౌవనోదయ మయ్యె, నే ప్రాణి యింక
శౌర్యపటిమప్రదర్శనస్థాన మగును ?

**2**

గీ. మృగపతి వసించు గిరిదరీగృహమునందుఁ
గరటికుంభస్థలీమౌక్తికములు దొరకు
వఱదు తల దాఁచుకొను నేలబొటియయందు
దొరకు నొక దూడతోఁకయో ? నరమొ ? ఖురమొ !

**3**

గీ. కరికిఁ గరిణికి నెవ్వాని గర్జితములు
దానశోషణగర్భపాతము లొనర్చె
నా మృగేంద్రుఁడు ముదిసి తారాడ లేక
యాఁడు లేళుల హాస్యాల కగ్గమయ్యె.

✶

# చందనచర్చ

1

ఉ. మూలమునన్ భుజంగములు,
మూర్ధమునందు విహంగపాళి, పా
ర్శ్వాల మతంగజమ్ములును,
శాఖలయందుఁ బ్లవంగవర్గముల్,
పూలను భృంగముల్, సవిధ
భూమిఁ గురంగము లేమి కోరియో
యేలనిబంటులై కొలుచు
నెప్పుడుఁ జందనవృక్షరాజమున్.

2

గీ. భుగభుగాయితవిషకీల పూత్కరించు
పాపజాతికిఁ బరిమళపవన భిక్ష
పెట్టి పోషించు శ్రీఖండవృక్షరాజ
మహిమ వర్ణింప నెవఁడు సమర్థుఁ డగును ?

3

చ. సకలజగత్ప్రమోదకర !
చందనభూజమ ! యీ వనమ్మునం
దిఁక నిలువంగఁ బోకు
మితరేతరఘర్షణజాతదావపా
వకకలితమ్ము లౌ నధమ
వంశము లున్నవి పెక్కు వీనిచే
స్వకుల మొకండె కాదు
సుమి ! సర్వవనమ్మును దగ్ధ మయ్యెడిన్.

4

గీ. జనన మెంతుమొ ? కఠినపాషాణభూమి
తనువు చూతుమొ ? దారుసాధారణంబు
సాహచర్యంబొ ? యాశీవిషమ్ముతోడ
మలయజయశమ్ము స్వగుణసంపాదితమ్ము.

5

శా. ఆశాంతప్రసరద్భవత్పరిమళ
వ్యాకృష్యమాణుండ నై
నీ శోభన్ గనులారఁ జూచుతమి
నెంతే దూర మేతెంచితిన్

నీ శాఖాభుజ మెక్కి యాడెడుఫణిన్
వీక్షించితిన్ జాలు పో!
యాశీర్వాదము! పోవ నిమ్ము నను
మే లౌఁ గాక పాటీరమా!

★

## కోకిలాలాపము

1

గీ. మధురపల్లవపుష్పసంభరితచూత
పోతమును నుజ్జగించి యో ముగ్ధపికమ!
చేదు నిండిన యా వేపచెట్టుమీఁదఁ
గాకులను గూడి యుంటకుఁ గతము చెపుమ!

2

గీ. మౌనమును మానుకొని పంచమస్వరమునఁ
గుహూకుహూశబ్ద మొకటి పల్కుము పికంబ!
కానిచో నెట్లు గుర్తింపఁ గలము నిన్నుఁ
గాకిమూకలలోన మాకందశాఖ.

3

ఉ. కీరచకోరపారవత కేకి
సమూహములార! చాలు మీ
మీ రవముల్ వృథార్భటులు
మెల్లఁ దొలంగుఁడు చాటుచోటికిఁ

నోరు మెదల్పఁ బోకుఁడు
　　　　వినూత్నవసంతరసాలపల్లవాం
కూరకషాయకంఠమునఁ
　　　　గోకిల గానసుధన్ వెలార్చెడిన్.

4

గీ. కోకిలా! నీ శరీరము కాకినలుపు,
అదియుఁ బరపోషితమ్ము, వనాంతరముల
నితరవిహగమ్ములను గూడి యెగురుచుందు,
చెవి సుధారసబిందువుల్ చిలుకు నేరు
పే గరుత్మంతునొద్ద గ్రహించినావొ?

5

గీ. ప్రాంగణము చేరి కావు కా వనుచుఁ గర్ణ
పరుషముగఁ గూయు కాకిని బాఱఁ ద్రోలి
యెచటనో కొమ్మలందుఁ గుహూరవమ్ము
సలుపుకోకిలదెసఁ జూపు నిలుపు బుధుఁడు.

6

గీ. అఱచెదవు, చిందు లాడెద, వడిచి పడెద
వేమి చేసిన నీ లోప మేమి? కాక!

కోకిలావాసచూతమ్ము నీకుఁ గూడ
వసతిఁ జేసినవిధి నన వలెను గాక.

7

గీ. తాలుచును గాక నల్లనితనువు, ఫలర
సమ్ములను గ్రోలుఁ గాక, రసాలశాఖ
నధివసించును గాక, యుద్యానవీథి
సంచరించును గాక, సుస్వరకళాప్ర
గల్భతఁ గాకి కాకె, పికమ్ము పికమె.

*

## కురంగీవిలాపము

1

చ. అలఘుతపఃప్రశాంత మగు
నాశ్రమభూమి యటన్న భ్రాంతినా ?
చిలుకలు గూడఁ జెట్లపయిఁ
'జీల్చుము, చంపుము, త్రావు' మన్నప
ల్కులె పఠియించు నీ యెఱుకు
గూడెము సొచ్చితి వోకురంగి ! యా
పలుకులు నీచెవిన్ బడవొ ?
పాపపు దుర్విధి మోసగించెనో ?

2

చ. పఱచిరి కాలపాశముల
వంటి యురుల్, మఱి పల్వలంబులన్
గరళము గల్పి దారుల
మొగంబుల గోతులు త్రవ్వి యగ్గి గొ

ల్వారి యిరుప్రక్కలన్ సెలసు
వింధ్లను దాలిచి నిల్చి రెట్టులున్
సురుఁగఁగ లేక యా హరిణ
సుందరి బోయని నిట్లు వేఁడెడిన్.

### 3

గీ. పలల మంతయుఁ గొనుము, జీవమ్ముతోడఁ
బొదుగు మాత్రము మిగిలిచి వదలు మన్న !
గడ్డి పట్టనినిసువులు గలవు రెండు
స్రుక్కి నాకోస మెదురులు సూచుచుండు.

★

## చిలుకపలుకు

1

చ. అమలినవృత్తి స్వేచ్ఛమెయి
నాకసమందును భూమిపై విహం
గములు విహారముల్ సలుపఁగా
సృజియించినధాత కీరపో
తమునకుఁ బంజరంపుఁజెఱ
తా ఘటియింపఁగ నేల యంచు న
బ్రము పడ నేల! తన్మధుర
భాషల కయ్యదియే ఫలం బగున్.

2

గీ. పలుకునేర్పును రూపసంపదయు సుభగ
చారుశీలము మధురవాచానిరూఢి
యున్నవే యమ్మ శుకమున, కొక్క చేని
ముద్దు గొల్పెనె మార్జాలమునకు సుంత.

3

శా. ఆవాసం బపరంజిపంజరము,
నిత్యాహారపానీయసం
సేవల్ రాజసుతోచితమ్ములు,
సభాసీనుండ వై చేయుప్ర
స్తావంబుల్ రఘురామనామపరముల్,
ధన్యుండ వన్నింట, నీ
భావం బా వనవృక్షకోటరదిశన్
బర్వెత్త నేలా శుకా!

★

# శుద్ధపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 8 | రజత | రజన |
| 12 | 5 | నీ తీరమందు | నే తీరమందు |
| 57 | 12 | గొల్పెనె | గొలుపెనె |